ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ

# భూగోళ విజ్ఞానము



:: కర్త ::

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్.

ఆంధ్ర సారస్వత పరిషత్తు
గోల్కొండ, హైదరాబాద్.

వెల 1-0-0

# విషయానుక్రమణిక



పుట

# గమనిక



భూగోళమును బోధించు పుస్తకాలు తెనుగులో కూడా కొన్ని ముద్రితమైనవి. కాని వాటిని చదువు విద్యార్థుల కవి తలనొప్పి కలిగించును. అనేక పుస్తకాలలో అవసరమైనవి వదలి అనవసరమైనవి పెంచి వ్రాసినారు. ఇప్పుడు ఈ గ్రంథములో సంగ్రహముగా ప్రపంచ భౌతిక స్వరూపము, ప్రపంచ జనులు, వారి ఆచారములు, వారి పరిశ్రమలు, పంటలు మున్నగునవి తెలుపబడినవి. ఇందలి విధానము సొంతముగా భూగోళము చదువుకొను వారికే కాక బళ్ళలో భూగోళము చదివిన వారికిని ఉపయుక్తముగా నుండునని భావింపనైనది.

భూగోళమును చదువువారు తెలుగులో ముద్రితమైన దేశఖండ పటములు, అట్లాసు పటాల పుస్తకమును ముందు పెట్టుకొనియే చదువవలెననియు, అది లేనిది చదువరాదనియు తెలుపుచున్నాము. ఇది ముఖ్యముగా గమనింపవలెను.

గ్రంథకర్త.

# భూగోళ విజ్ఞానము

~~*~~

## ౧. ఖగోళము

మనము నివసించు భూమియే చాలా గొప్పదనియు తక్కిన సూర్యాదిగ్రహాలు, నక్షత్రాలు అన్నియు మినుకు మినుకుమను చిన్నని అగ్నికణాలని అనుకొనువారికన్న తెలివి తక్కువవారు ప్రపంచములో ఉండరు. మన భూమి అండ కోటి బ్రహ్మాండములో ఒక ఇసుక కణము అనుకొనవలెను. భూలోకముయొక్క అడ్డుకొలత ౭౯౧౨ మైళ్లు మాత్రమే! మనకు అన్నిటికంటే దగ్గరగా ఉండు లోకము ఒక చంద్ర మండలమే. అది ౨౩౯౦౦౦ మైళ్ళ దూరములో ఉన్నది. చంద్రుడు ఇంచుమించు నెలకొకమారు భూమిచుట్టు తిరిగి వచ్చును. చంద్రుని తర్వాత మనకు చాలా దగ్గర ఉన్నట్టిది సూర్యమండలమే. అది భూమినుండి ౯ కోట్ల ౩౦ లక్షల ౫౭ వేల మైళ్ళ దూరమున నున్నది. ఇక తక్కిన నక్షత్ర లన్నియు మనకు కోటానకోట్ల మైళ్ళ దూరములో ఉన్నవి. చాలా నక్షత్రాలు సూర్యునికంటే వేలఅంతలు, లక్షలంతలు, కోట్లఅంతలు పెద్దగా ఉన్నట్టివి కలవు. కాని అవి మనకు చెప్ప జాలనంతటి కోట్లకోట్ల కోటాను కోట్ల మైళ్ళదూరములో ఉన్నందున మనకు గూటిలోని దీపమంతవిగా కనబడుచున్నవి.

మన భూమిచుట్టు ఎడతెగకుండా ప్రదక్షిణము చేయుచు సేవచేయు వాడొక్క చంద్రుడే! కాని

యూరేనస్ (వరుణుడు) అను గ్రహముచుట్టు నాలుగు చంద్ర మండలాలు తిరుగుచున్నవి. జ్యూపిటర్ (బృహస్పతి) చుట్టు తొమ్మిది చంద్రమండలాలును, శనిగ్రహము చుట్టు ఎనిమిది చంద్రమండలాలు తిరుగుచున్నవి.

భూమండలము దిన మొకమారు తనచుట్టు తిరుగుచు సంవత్సరమున కొకమారు సూర్యునిచుట్టు తిరిగి వచ్చును. అట్లు తిరిగి వచ్చు దూరము ౫౮౩౮_౨౫౭౫౪ మైళ్ళు. ఈ దూరమును ౩౬౫ ౧/౪ దినాలలో పూర్తి చేయును.

చంద్రమండలము సూర్యమండలమంత పెద్దగా మనకు కనబడును. కాని అది నక్షత్రాలన్నింటిలో ఒక చిన్న నక్షత్రము. అది మనకు చాలా దగ్గరగా నున్నందున పెద్దగా కనబడును. దాని అడ్డకొలత ౨౧౬౦ మైళ్లుమాత్రమే. చంద్రునికి స్వయముగా ప్రకాశము లేదు. సూర్యుని కాంతిని అద్దము వలె మన కది ప్రసరింప జేయుచున్నది.

సూర్యుడు మన భూమినుండి ౯ కోట్ల 30 లక్షల చిల్లర మైళ్ళదూరములో ఉన్నాడుకదా. అనగా మనకు చంద్రుడెంతదూరములో ఉన్నాడో అంత ౪౦౦ అంతల దూరములో సూర్యుడు ఉన్నాడు. సూర్యుని అడ్డ కొలత ౮౬౪,౦౦౦ మైళ్ళు. సూర్యమండలములో మన భూమండలాల వంటివి ౧౩లక్షల మండలాలు పూర్తిగా ఇమిడిపోవును.

నక్షత్రాలు మనకు చిన్న చుక్కలుగా కనిపించును. అవి సూర్యునికంటె పెద్దవి. అవి మన భూమండలము నుండి సూర్యునికంటె ఎన్నో రెట్లు ఇంకా దూరములో నుండుట చేత మనకు చాలా చిన్నవిగా కనబడును.

అన్నిటికన్న మనకు దగ్గరగా ఉండే నక్షత్రము పేరు ప్రాగ్జిమా సెంటీరీ అనునది. అది మనభూమికి ౨౫ లక్షల కోట్ల మైళ్ళ దూరములో నున్నది. అంకెలలో ఆ దూరమును చూపవలెనన్న అది యిట్లుండును.

౨౫౦౦౦౦౦,౦౦౦౦౦౦౦ మైళ్ళు.

అనగా మనకు సూర్యుడెంత దూరమున నున్నాడో అంత ౨౭౦,౦౦౦ అంతల దూరములో ఆ నక్షత్రమున్నది. మరి అదే మనకు చాలా దగ్గరగా ఉండు నక్షత్రమని అనుచున్నారు. సూర్యచంద్రుల తర్వాత మనకు ప్రకాశమానముగా కనబడు నక్షత్రమునకు సిరియస్ అను పేరు పెట్టినారు. అది మనకు ౫౧ లక్షల కోటి మైళ్ళ దూరములో నున్నది. అనగా మనకు దగ్గరగా ఉండు నక్షత్రమంత రెండంతల దూరములో నున్నది.

చంద్రమండలము తర్వాత మనకు దగ్గరగా ఉండు గ్రహము వీనస్ (శుక్రనక్షత్రము) అనునది.

శని గ్రహము చాలా చిత్రమయినది. దాని చుట్టు (౧౦) చంద్రమండలాలు తిరుగును. దానికి చుట్టు మూడు ఉంగరముల వలె కాంతి రేఖలు కనబడును. మన భూమండలము రెండు వందల కోట్ల ఏండ్లనుండి ఏర్పడి యున్నదని శాస్త్రజ్ఞులు అంచనా వేసినారు. మన భూమండలముయొక్క తూకము ౫,౮౮౫,౫౧౬,౦౦౦,౦౦౦,౦౦౦,౦౦౦,౦౦౦ టన్నులని సైన్సువేత్తలు నిర్ణయించినారు. సూర్యుడు భూమికంటే 33౨,౦౦౦ అంత ఎక్కువ తూకము కలవా[illegible]ను.

భూమియొక్క లోతు (౮౦౦౦) మైళ్ళు. సాధారణముగా ఒక మైలు లోతుకూడా మానవులు భూమిని త్రవ్వ లేదుకదా! భూమి నిడివిలోతు (౮౦౦౦) మైళ్ళు అని యెట్లు చెప్పగలము అని ప్రశ్నింపవచ్చును. అది చెప్పుట సులభమే. ఎట్లనగా సాధరణముగా గుండ్రని చెండుకాని, పండు కాని తీసుకొని దాని అడ్డకొలతను, చుట్టుకొలతను కొలిచి చూచిన, చుట్టుకొలత అడ్డకొలత కంటె మూడు పాళ్ళ కన్న కొద్దిగా ఎక్కువగా నుండును. మన భూమండలము యితర గ్రహ నక్షత్రాలవలె గుండ్రముగా నున్నది. దాని చుట్టుకొలత ౨౫౦౦౦ మైళ్ళు. కావున గణితము చేసిన నిడివికొలత లేక లోతు ౮౦౦౦ మైళ్లు అని తేలిపోవును.

బ్రహ్మాండములోని నక్షత్రాలు మనకు కోటానుకోట్ల మైళ్ళ దూరములో నుండుట చేత మైళ్ళ లెక్కను వదలు కొని వెలుతురు సంవత్సరాలతో వ్యవహరింపవలసి వచ్చినది. వెలుతురు ఒక చిటికలో ౧౮౬,౦౦౧ మైళ్ళదూరము ప్రయాణము చేయును. ఒక నక్షత్రము మన భూమండలానికి ఒక సంవత్సరము వెలుతురు దూరములో ఉన్నదనిన ౧ × ౩౬౫ (దినాలు) × ౨౪(గంటలు) × ౬౦ నిమిషాలు × ౬౦ క్షణాలు × ౧౮౬౦౦౦ (వెలుతురు క్షణవేగము ) అని గుణింప వలెను. కొన్ని నక్షత్రాలు మన భూమండలాని కెంత దూరమున నున్నవో తెలుసుకొందము. సిరియస్ నక్షత్రము ఎనిమిది న్నర సంవత్సరాల దూరములో ఉన్నది. అనగా ఒక క్షణానికి వెలుతురు ౧౮౬౦౦౦ మైళ్ళ వేగము చొప్పున ప్రయా

ణముచేసిన ఆ నక్షత్రమునుండి బయలుదేరిన వెలుతురు మన భూలోకమునకు ఎనిమిదిన్నర సంవత్సరాలకు చేరుకొనును. అనగా ఆ లెక్క యిట్లుండును.

౮ ౧/౨ × ౩౬౫ × ౨౪ × ౬౦ × ౬౦ × ౧౮౬౦౦౦.

పనిలేనివారు ఈ లెక్కను గుణించి తెలుసుకోవచ్చును. ప్రోక్స్యిమా అను నక్షత్రము పదిన్నర సంవత్సరాల వెలుతురు దూరములో ఉన్నది. ఇదికూడా దగ్గరి నక్షత్రాలలో జమకట్టబడినది. కొన్ని నక్షత్రాలు ౧౮౪౦౦౦ వెలుతురు సంవత్సరాల దూరములో, కొన్ని ౭౫౦,౦౦౦ వెలుతురు సంవత్సరాల దూరములో ఉన్నవి. ఇంకా అంతకంటె చాలాదూరములోనివి కూడా కలవు. పలువురు హిందువులకు సూర్యుడే పరమాత్మ. కాని మన సూర్యనారాయణుని కంటె వేల అంతల పెద్దవై, వేల అంతల కాంతి కలవైనట్టి సూర్యలోకాలు ఈ బ్రహ్మాండములో కలవు. బ్రహ్మాండములో ఎన్నికోట్ల లోకాలున్నవో ఆ "అఖిలాండకోటి బ్రహ్మాండనాయకునికే" ఎరుక. మనకు రెండు లక్షల చిల్లర మైళ్ళలోనున్న చంద్రునియొక్క ముఖమే అనాదినుండియు కనుపించుచు వచ్చినది. కాని దానివీపు ఎట్టిదో ఆ సృష్టికర్తకే ఎరుక. ఇక దూరములో నుండువాటినిగురించి మనమేమెరుగగలము? మన సైన్సు వేత్తలు ౧౦ వేలకోట్ల నక్షత్రాలుండవచ్చునని అంచనా వేసినారు. అన్నిటికంటె దూరములోనుండు నక్షత్రాలు మనకు ౨౫కోట్లపండ్ల వెలుతురు సంవత్సరాల దూరములోనున్నవట! దీనిపై నాస్తికులేమందురో ఏమో. గంటకు ౬౭ మైళ్ళ వేగముతో పోవు రైలులో ప్రయాణమైనచో నెప్ట్యూన్ (ఇంద్రగ

హాము) మనము ౪౦౦౦ ఏండ్లకు చేరుకోగలం. మరియు మనకు చాలా దగ్గరగా ఉండు నక్షత్రమును ౪ ఏండ్లకు చేరుకోగలము!!

ఆకాశములోని ౧౨ రాశుల పేర్లను మొదట మన దేశమువారు నిర్ణయించిరి. మేకలు సమృద్ధిగా ఈనుకాలమును మేషము అనిరి. వారికి పూజ్యమైన ఎద్దుపేరు ఒక రాశికి పెట్టిరి. మే నెల ప్రాంతములో మేకలు రెండు రెండు పిల్లలను యీనును. కాన మిథునము అని ఆ రాశికి పేరు పెట్టిరి. సూర్యుడు కొద్దిగా తిరోగమనము చేయు కాలము కాన ఎండ్రకాయవలె వెనుకకు పోవునని ఒకరాశిని కర్కాటకమనిరి. సూర్యుడు మహాతేజస్సుతో నుండిన రాశిని సింహరాశి అనిరి. కోతల కాలమును కన్య అనిరి. దివారాత్రములు సరిగా నుండు కాలమును త్రాసుతో నిరూపించిరి. అక్టోబరు మాసములో రోగాలు ప్రబలుట చేత ఆ రాశిని వృశ్చికమనిరి. తర్వాత జనులు వేటాడు కాలము కాన ధనుస్సు పేరిచ్చిరి. వర్షాకాలమును చేపతో సూచించిరి. నీటిలో చేపలుండుననుట కా పేరును పెట్టిరి.

(నక్షత్ర శాస్త్రమును ఇందు విరివిగా నుదాహరించుటకు వీలు లేదు. అభిలాషులు ఇంగ్లీషులో (1) The Stars in Their Courses; by J.Jeans 2.The mysterious universe, మరియు తెలుగులో కాళీపట్నం కొండయ్యగారు వ్రాసిన విశ్వరూపము అను ఉత్తమ గ్రంథమును చదువగలరు. మరియు ఇంగ్లీషులో టైమ్సు ఆఫ్ ఇండియా బొంబాయివారు ప్రచురించిన Every body's book of facts యను ఉత్తమ గ్రంథమును చదువవలెను.)



# ౨. భూమండలము

మన భూమండలములో సముద్రము మూడుపాళ్లు, భూమి ఒక్కపాలు కలదు. సముద్రము లేవనగా:— ఉత్తరమున నుండు సముద్రము ఉత్తర ధ్రువ మహాసముద్రము (దీనిని ఇంగ్లీషులో ఆర్కిటిక్ అందురు.) దక్షిణములో ఉండునది దక్షిణధ్రువ మహాసముద్రము (అంటార్కిటిక్). మన హిందూ దేశమునకు దక్షిణమున ఉండునది హిందూమహాసముద్రము (దీనిని మన ప్రాచీనులు మహాసాగరమనిరి.) అమెరికాకు, ఆఫ్రికాకు మధ్యనుండునది అతలాంతిక మహాసముద్రము (అంట్లాంటిక్). తూర్పున జపాన్, ఆస్ట్రేలియాల యొద్ద నుండునది శాంతిమహాసముద్రము (పసిఫిక్).

ఇవికాక చిన్నచిన్న సముద్రాలు కొన్ని కలవు. కొన్ని యేయే దేశాలయొద్ద నుండునో ఆ దేశాల పేర్లతో పిలువబడును. బెంగాలు సముద్రము, అరేబియా సముద్రము అట్టివి. ఆఫ్రికాకు ఉత్తరమున, యూరోపునకు దక్షిణమున ఉండునది మధ్యధరా సముద్రము. దానికి తూర్పులో కశ్యపసముద్రము (కాస్పియన్) కలదు. దానినే మన పూర్వులు క్షీరసముద్రమనిరి. ఇరానీలు అదే అర్థముగల షీర్వాన్ (క్షీరవాన్) సముద్రమనిరి. అరేబియాకు పడమట నుండునది ఎఱ్ఱ సముద్రము (రెడ్ సీ). దానినే మన పూర్వులు హితసాగరము అనియనిరి. ఉత్తర ధ్రువములో ఎవ్వరును పోని ఉత్తరప్రాంతాలకు పియరీ, వాన్సన్ అనువారు వెళ్ళిరి. అదే విధముగా దక్షిణ ధ్రువ ప్రాంతాలకు షాకిల్టన్, కెప్టన్ స్కాట్ అను వారు వెళ్ళి చాలా విషయాలు కనిపెట్టిరి.

సముద్రముల వైశాల్యము మొత్తము ౧౪ కోట్ల చదరపు మైళ్ళు. అందు పసిఫిక్ మహాసాగరము ౬ కోట్ల ౭౦ లక్షల చదరపు మైళ్లును, అట్లాంటికు మహాసాగరము 3 కోట్ల ౪౦ లక్షల ౮ చదరపు మైళ్ళును హిందూ మహాసాగరము ౧ కోటి ౮౦ లక్షల చదరపు మైళ్ళును, ఆర్కిటిక్ మహాసాగరము ౫౪ లక్షల చదరపు మైళ్ళును, అంటార్కిటిక్ మహాసాగరము ౧ కోటి ౨ లక్షల ౮ మైళ్లును, వైశాల్యము కలవి. అన్నిటికన్న ఉప్పు నీరు కలదిఎఱ్ఱ సముద్రము. పసిఫిక్ సాగరము 3౦ వేల అడుగులలోతు గలది. కొన్ని తావులలో 3౫౦౦౦ అడుగుల లోతు కన్న హెచ్చుగాకలదు.

ఆరు ఖండాలకు పేరు లేవిధముగా వచ్చెనో కనుగొందము. బాబిలోనియాలో ప్రాచీనముందుండిన అసీరియనులు సూర్యుడుదయించుటకు అసు అందురు. సూర్యుడుదయించు దేశము కాన ఆసియా అనిరి. కొందరు సంస్కృతములోని ఉషస్సు అను శబ్దమునుండి ఆసియా పద మేర్పడినదనిరి. ఇది కూడా సమంజసముగా నున్నది. సూర్యాస్తమయమును వారు ఎరఫ్ అందురు. కావున యూరోపు పేరు వచ్చెను. ఆఫ్రికాను ప్రాచీనమందు లిబియా అనిరి. ఋగ్వేదకాలమం దార్యులు దానినే ఋభు దేశమనిరి, లిబియాలోని ఒక జాతి పేరును బట్టి తర్వాత ఆఫ్రికా అని రోమనులు పేరు పెట్టిరి. అమెరికన్ వెస్పూషియస్ అను యూరోపులోని ఫ్లోరెన్సువాడొకడు క్రీ. శ. ౧౪౯౦ ప్రాంతమందు పెట్టినందున అమెరికా పేరు ఏర్పడె నందురు. ఆస్ట్రలిస్ అనగా దక్షిణ దేశము. అందుచేత ఆస్ట్రేలియా అను పేరు ఏర్పడెను.

ఈ విధముగా మన భూమండలములోని ఖండములకు పేరు లేర్పడెను.

ప్రపంచ ఖండముల వైశాల్యము ౧౯౫౦ లోని జనాభా ప్రకారము ఈ క్రింది విధముగా ఉన్నది.

| ఖండము. | చదరపు మైళ్ళు. | జన సంఖ్య. |
|---|---|---|
| యూరోపు | ౩,౫౦౦,౦౦౦ | ౫౫ కోట్లు. |
| ఆఫ్రికా | ౧౧,౪౫౦,౦౦౦ | ౧౨ ,, |
| ఉత్తర అమెరికా | ౮౭,౬౨,౦౦౦ | ౧౮ ,, |
| దక్షిణ ,, | ౭౦,౧౩,౦౦౦ | ౧౦ ,, |
| ఏషియా ,, | ౧,౭౨,౫౦,౦౦౦ | ౧౨౦ ,, |
| ఆస్ట్రేలియా లేక ఓషీనియా | ౨౯,౭౪,౫౦౦ | ౧ ,, |

మొత్తము ప్రపంచములో ఇంచుమించు ౨౫౦ కోట్లు మానవులున్నారు.

ఇటీవల దక్షిణధ్రువ ప్రాంతములో మంచుతో నిండి నిర్మానుష్యమగు గొప్పఖండమును కనిపెట్టినారు. దానికి అంటార్టికా అని పేరు పెట్టినారు. దాని వైశాల్యము ౫౦ లక్షల చదరపు మైళ్ళని అంచనా వేసినారు. దానిని గురించిన వివరాలంతకంటే యెక్కువ తెలియరాలేదు. మనమిప్పుడు పై ఆరు ఖండములను గూర్చి తెలుసుకొనవలెను.

అవేవనగా :—

ఆశియాఖండము (ఇదే పెద్ద ఖండము). యూరోపు ఖండము, ఆఫ్రికాఖండము, ఉత్తరఅమెరికా, దక్షిణఅమెరికా ఖండములు, ఓషీనియా లేక ఆస్ట్రేలియాఖండము. ఈ ఖండా

ఎలో జ్ఞాపక ముంచుకొనదగిన గొప్ప పర్వతములును గొప్ప నదులును ఏవనగా :-

పర్వతాలు : హిమాలయము, ఇది హిందూస్థానములో ఉత్తరమున నున్నది. ఇది ౧౫౦౦ మైళ్ళ పొడవునను ౨౯౦౦౦ అడుగుల యెత్తువరకును ఉన్నది. ప్రపంచ పర్వతాలలో కెల్ల గొప్ప పర్వతమిదే. హిందూకుష్ పర్వాతాలు ఆఫ్ఘనిస్థానము, పర్షియా దేశాల కుత్తరమున నున్నవి.

అల్టాయి పర్వతాలు, హిమాలయము తర్వాత యెత్తయిన వివే. మధ్య ఏషియాలో చీనాకుత్తరములో ఉన్నవి.

ఫూజియామా అను అగ్ని పర్వతము జపానులో కలదు దానిపై జపానీలకు చాలా భక్తి కలదు. దానిని వారొక పవిత్ర పర్వతముగా పూజింతురు.

యూరోపులో యూరల్ పర్వతము గొప్పది. అది ఏషియా యూరపు ఖండాలకు మధ్యన ఉన్నది. ఆల్ప్సుపర్వతము ఇటలీ కుత్తరమున నున్నది. యూరోపు ఖండములో ఇవే పెద్ద పర్వతాలు. ఆఫ్రికాలోని పశ్చిమోత్తర భాగములో అట్లసు పర్వతము కలదు. అది ౧౪,౫౦౦ అడుగుల ఎత్తువరకున్నది. దక్షిణ అమెరికాలో ఆండీస్ అను పర్వత శ్రేణి చాలా గొప్పది. అది ౫౦౦౦ మైళ్ళ పొడవున ఉన్నది. ఒక తావున అది ౨౩౦౦౦ యడుగుల ఎత్తున్నది.

ఎడారులు:-

చెట్టుచేమ లేక అఖండముగా ఇసుక భూములుగా నుండు భాగాలను ఎడారులందురు. అన్నిటికన్న పెద్ద ఎడారి సహారా. అది 3౫ లక్షల చదరపుమైళ్ళ వైశాల్యము కలది.

అందు ౧౪౦ డిగ్రీల ఎండ యుండును. రాత్రి మరల చల్లగా నుండును. అది ఉత్తర ఆఫ్రికాలో కలదు. దక్షిణాఫ్రికాలో కలహారీ ఎడారి కలదు. దాని వైశాల్యము ౧ లక్ష ౨౦ వేల చదరపు మైళ్ళు. చీనాకు సమీపములో గోబీ యెడారి కలదు. ౧౦౦౦ మైళ్లు అడ్డముగాను, ౬౦౦ మైళ్లు నిడివిగాను అది కలదు. అరేబియా దేశముకుప్పాతిక భాగము యెడారియే. ఆస్ట్రేలియాలో కూడా చాలా యెడారులు కలవు.

నదులు:—

పెద్ద నదులలో తెలుసుకొనదగిన వేమనగా :

హిందుస్థానములో:—గంగ, సింధు, బ్రహ్మపుత్ర, గోదావరి, కృష్ణ, కావేరి, నర్మద, తపతి.

చీనాలో:—హాంగ్ హో. దీనిని చీనా దుఃఖస్రవంతి China's Sorrow) యని వర్ణింతురు. ఏటేట దీని వరదల వలన వేలకొలది జనులు చత్తురు. గ్రామాలు కొన్ని పూర్తిగా కొట్టుకొని పోవును.

ఆఫ్రికాలో:—నీలనది (నైల్). కాంగో, నైగర్, జాంబీసినదులు. నీల నది ౨౦౦౦ మైళ్ళ పొడవున పారును. కాంగో కూడ అంత పెద్ద నదియే. జాంబీసినది ఒకచోట ౪౨౦ యడుగుల యెత్తునుండి దుముకును. దానికి విక్టోరియా జలపాతమని పేరు పెట్టారు.

ఉత్తర అమెరికాలో:— మిసిసిపీనది చాలా గొప్పది రెండవది లారెన్సు నది. దానిలో నొకచోట నయాగరా జలపాతము గలదు దానినుండి జలవిద్యుత్తును (మన మైసూరులో నిజోగ్, శివసముద్ర జలపాతములందువలె)సృష్టించినారు.

దక్షిణ అమెరికాలో :- అమెజాన్ నది కలదు. అది 3,900 మైళ్ళ పొడవున ప్రవహించును.

యూరోపులో :- రష్యాలోని వోల్గానది, జర్మనీలోని రైన్ నది, డాన్యూబ్ నదులు గొప్పనదులు.

ప్రతి దేశంలోను చిన్నవి, గొప్పవి నదులు చాలాకలవు.

ఇక ఒక్కొక్క ఖండములోని దేశాల పేర్లను తెలుసుకొందము.

# ౩. యూరోపు ఖండము

యూరోపుఖండ వైశాల్యము ౩౭ లక్షల ౬౦ వేల చదరపు మైళ్లు, ఆసియాఖండము దానికంటే ఐదంతలు పెద్దది. ఈ ఖండములో నూటికి ౩౧ పాళ్లు అడవి కలదు. ప్రపంచములోని ఖనిజసంపదలో సగము యూరోపులోనే కలదు. అనగా నేలబొగ్గు, ఇనుము, పెట్రోలు, సీసము, రాగి, అల్యూమినం విశేషముగా కలవన్నమాట. యూరోపు ఖండములో ౧౩౦౪౦౦ మైళ్ళ రైలుదారి కలదు. ప్రపంచములో నెల్ల యూరోపులోనే పరిశ్రమలు ఎక్కువగా కలవు. ఆ సరకులను వారు ఏషియా ఆఫ్రికా ఖండాలలో అమ్మి గొప్ప లాభాలు పొందుచున్నారు. యూరోపులో కంటె ఎక్కువగా కెనడా, సంయుక్త అమెరికా రాష్ట్రములలో మాత్రమే ౧౭౦౧౦౦ మైళ్ల రైలుదారి కలదు. యూరోపులో ౫౫ కోట్ల జనులు కలరు.

యూరోపులోని పెద్ద దేశము రష్యా దేశము. అచ్చట ఉత్తరభాగ మంతయు ఏడాది పొడువున మంచుతో నిండి నివాసయోగ్యము కాకుండ ఉన్నది. ఆ ప్రాంతాలలో ఆరు నెలలు పగలు, ఆరు నెలలు చీకటి యుండును. రష్యాలో ౧౦ కోట్లమంది కలరు. అనగా సగటున మైలుకు ౧౫ మందియే కలరు. క్రీ. శ. ౧౯౧౭ న అది ప్రజారాజ్యమై యున్నది. ప్రపంచములో నెల్లను అత్యధికముగా గోధుమలు పండించునది రష్యా దేశమే. అందు ఖనిజసంపద విశేషముగా కలదు. ౬౦౦౦౦ మైళ్ళ రైలుదారి కలదు. పూర్వము దాని ముఖ్యపట్టణము లెనిన్‌గ్రాడ్. ఇప్పుడు మాస్కో ముఖ్య

పట్టణమందు యున్నది. బాకూ అను దక్షిణములోని పట్టణము పెట్రోలు గనులకు చాలా ప్రసిద్ధి. రష్యాలో ౧౭౦ భాషలు మాట్లాడు చున్నారు.

స్విస్సు దేశము :-

ఇది పర్వతప్రాంతము. ౧౬౦౦౦ చ. మైళ్ళ వైశాల్యమునూ, ౪౨ లక్షల జనసంఖ్యయు కలది. అచ్చట మూడు ముఖ్యభాషలు మాట్లాడుదురు. గోధుమలు ముఖ్యమగు పంట. అచ్చట ద్రాక్ష యెక్కువగా పండింతురు. పర్వతాలు దేశమంతట నిండినందున అచ్చట చిన్న చిన్న నదులు నిరంతరము పారుచుండును. అందు చాలా జలపాతాలున్నవి. వాటి నుండి 3౧ తావులలో జలవిద్యుత్తును ఉత్పత్తి చేసి పరిశ్రమలు చాలా వృద్ధిచేసి జనులకు గొప్ప జీవనాధారాలు కల్పించినారు. స్విస్సు దేశము గడియారాలు చేయుటలో అగ్రస్థానము వహించినది. స్విస్సు దేశములో ఆవులు, బర్రెలు విశేషముగా పాలిచ్చును. అచ్చటి జనులు పాలను పొడిచేసి డబ్బాలలో నింపి మన దేశమువంటి దేశాలకు పంపి అమ్మింతురు. యూరోపు దేశములలోకి స్విస్ దేశమే చాలా సుందర దేశమని, యూరోపు ఖండ ఖేలనస్థలమని ( Playground ) ప్రసిద్ధి గాంచినది. స్విస్సు దేశపు ముఖ్యపట్టణము బర్న్ ( Berne ). ఈ దేశములో ప్రజా రాజ్యము కలదు. ఫెడరల్ విధానములో ఫెడరల్ కౌన్సిల్ ద్వారా పాలనము జరుగును.

హంగరీ :-

వైశాల్యము 3౫౨౭౫ చ. మైళ్ళు. జనసంఖ్య ౯౦ లక్షలు. ముఖ్యపట్టణము బుడాపెస్టు. ఇది డాన్యూబ్ నదికి

రెండుదిక్కుల పెరిగిన నగరము. గోధుమలు, మొక్కజొన్నలు ముఖ్యమగు పంటలు. ఈ దేశములో ఇటీవలనే ప్రజారాజ్య మేర్పడినది.

బాల్కన్ రాజ్యాలు :-

ఇందు బల్గేరియా, అల్బేనియా, గ్రీసు, యుగోస్లావియా, తుర్కీ దేశాలు చేరినవి.

బల్గేరియా చాలా బీద దేశము. వైశాల్యము ౪౦,౦౦౦ మైళ్లు. ఖనిజసంపద మాత్రము బాగా కలదు. పట్టు పరిశ్రమ ముఖ్యమైన పరిశ్రమ. నూటికి ౮౦ నుంది మన భారత దేశ ములో వలె వ్యవసాయముపై జీవించుచున్నారు.

అల్బేనియా:—ఇది కూడా దరిద్ర దేశమే. వైశాల్యము ౧౦,౬౨౯ చ. మైళ్ళు. ౧౧ లక్షల జనసంఖ్య.

గ్రీసు:- గ్రీసు దేశముచాలా ప్రాచీనమందు నాగరికత చెంది యిప్పుడు నామ మాత్రముతో నుండు దేశము. ద్రాక్ష ముఖ్యమగు పంట. ఏథెన్సు అనునది ముఖ్యపట్టణము. ఈ దేశమునకు సుల్తానుండెను. రెండవ ప్రపంచ యుద్ధా ప్రజారాజ్య నంతరము మేర్పడెను.

యుగోస్లావియా:— వైశాల్యము ౯౬,౦౦౦ చ. మైళ్లు. జనసంఖ్య ఒకటిన్నరకోటి. బెల్గ్రేడ్ దాని ముఖ్య పట్టణము.

తుర్కీ:—ఇదికొంత యూరోపులోను, కొంత ఏషియా లోను కలదు. దీనిపూర్వపు ముఖ్యపట్టణము ఇస్తంబూల్ (కాన్‌స్టాంటినోపల్). ఈ దేశము రిపబ్లికుగా ఉన్నది. వైశా ల్యము 3 లక్షల చదరపు మైళ్లు. జనాభా ౨ కోట్లు. నేటి రాజధాని అంకారా.

హాలెండు:— వైశాల్యము ౧౩,౫౧౮ చదరపు మైళ్ళు. జనసంఖ్య ౯౯ లక్షలు. ఈ దేశము సముద్రముకంటె తగ్గులో సముద్రతీరమందే కలదు. అందుచేత సముద్రము పొడవున ఆనకట్ట కట్టినారు. ఇంత చిన్న దేశము ఇండోనీషియా, గయానా, మున్నగు శాంతిసాగర ద్వీపాలను జయించి, పాలించి, ౧౯౫౦లో వాటికి స్వరాజ్యమిచ్చెను. హాలెండును నెదర్‌లెండు దేశమందురు. ఇందు ప్రతి చదరపు మైలులో కల పశువులు ప్రపంచములో మరెచ్చటను లేవు. అందుచేత వెన్న, జున్ను, డబ్బాపాలు విశేషముగా ఎగుమతి చేయుదురు. ప్రతి దినము తెల్లవారు వరకు యింగ్లండునకు వెన్న, కోడి గుడ్లు హాలెండునుండి పంపుచుందురు. దీని ముఖ్య పట్టణము ఆంస్టర్‌డాం. ఈ దేశమునకు రాణి పరిపాలనము కలదు. రాజధాని హేగ్.

బెల్జియం :— వైశాల్యము ౧౨ లక్షల చ. మైళ్లు. జనసంఖ్య ౮౭లక్షలు. హాలెండువలెనే ఇదియు చిన్న దేశము. వ్యవసాయమే ప్రధానవృత్తి. అందు పాలు, వెన్న మరింత ముఖ్యవృత్తి. బ్రస్సెల్సు అనునది దాని ముఖ్యపట్టణము. బెల్జియమునుండి యినుము, అద్దము, బట్టలు, జింక్, సిమెంటు ఎగుమతి యగును. ఈ దేశమునకు రాజపరిపాలనము కలదు. రెండు శాసనసభలు కలవు.

డెన్మార్కు:— ఇది చాలా చిన్న దేశము. వైశాల్యము ౧౬ వేల చదరపు మైళ్ళు. జనసంఖ్య ౪౨ లక్షలే. ఇది కేవలము వ్యవసాయ దేశము. గోధుమలు చాలాపండును. పాలు, వెన్న పరిశ్రమపై జనులు జీవింతురు. ప్రపంచములో నెల్ల

నీ పరిశ్రమలకు ఇదే ప్రదేశము ప్రసిద్ధి. కోపన్‌హేగన్ ముఖ్యపట్టణము. ఈ దేశమునకు రాజుకలడు. రీష్టాగ్ అను పార్లమెంటు ద్వారా పాలించును.

స్కాండనేవియా:-ఇందునార్వే, స్వీడన్ దేశాలుకలవు. నార్వే వైశాల్యము ౧౨౪౦౦౦చ. మైళ్ళు. జనసంఖ్య ౨౩లక్షలకు పైగా కలదు. చేపలు పట్టుట ప్రధానపరిశ్రమ. ఇక్కడినుండి కాడ్‌లివర్‌ఆయిలు అను చేపనూనె ఔషధము ఎక్కువగా ఎగుమతి యగును. అగ్గిపెట్టెలకు కాగితాల పరిశ్రమకీ దేశము ప్రసిద్ధి పొందినది. ఓస్లో దీని ముఖ్యపట్టణము. ఈ దేశమునకు రాజు కలడు. అతనికి చాలా అధికారాలు కలవు.

స్వీడన్:-వైశాల్యము ౧౭౩౦౦౦ చదరపు మైళ్లు. జనసంఖ్య 60 లక్షలు యిక్కడ అడవు లెక్కువగా ఉన్నవి. ఈ దేశము యినుము చాలా ప్రసిద్ధి. అడవులు, గంధకము ఎక్కువగా ఉండుట వలన అగ్గిపుల్లల పరిశ్రమ కీ దేశము ప్రసిద్ధి. ఈ దేశము కాగితాలు హిందూస్థాన మంతటను విక్రయమగును. స్టాక్‌హోం దీని ముఖ్యపట్టము. ఈ దేశములో రాజపాలనము కలదు.

స్పెయిన్ దేశము:-వైశాల్యము ౧౯౬౦౦౦చ. మైళ్ళు. జనసంఖ్య 3 కోట్లు. ఇది ఎక్కువగా వ్యవసాయ దేశము. ఆలివ్‌నూనె, కార్కులు, ఈ దేశమునుండి విశేషముగా సర్వత్ర ఎగుమతి యగును. ఈ దేశపు ఉన్ని చాలా శ్రేష్ఠమైనదని ప్రతీతి. సీసము, రాగి, పాదరసము, వెండి, జింక్, ఇనుము, మాంగనీస్ యీ దేశములో నున్నంత యూరో

పులో మరెచ్చటను లేవు. సారాయికూడా యిచ్చట చాలా ప్రసిద్ధముగా సిద్ధమగును. దీని ముఖ్యపట్టణము మాడ్రిడ్. ఈ దేశమునకు రాజుండెను, యిప్పుడు లేడు.

పోర్చుగల్ :- ఇది చాలా చిన్న దేశము. వైశాల్యము ౩౫,౦౦౦ చదరపు మైళ్ళు. ౧ కోటి జనులు కలరు. నూటికి ౬౦ మంది వ్యవసాయముపై జీవింతురు అక్కడ యినుము చాలా దొరుకును. కార్కు, మేలైన పింగాణి పెంకులు ఎగుమతి యగును. లిస్బన్ దాని ముఖ్యపట్టణము. పోర్చుగల్ మన హిందూదేశములో గోవా, దమన్, దివి అను మూడు రేవుల నాక్రమించు కొన్నది.

బ్రిటిష్ దీవులు:- దీని వైశాల్యము ౮౮,౦౦౦చదరపు మైళ్ళు. ఇందు యింగ్లండు, స్కాట్లెండు, చేరినవి. జనసంఖ్య ౫ కోట్లు. అచ్చటి జనులను బ్రిటిషువారని, యింగ్లీషువారని ఆంగ్లులని, ఆంగ్లేయులని అందురు. అందు నేలబొగ్గు యినుము చాలా కలదు.

ఈ దేశములో ౨౫,౦౦౦ మైళ్ళ రైలు దారి కలదు. ఈ దేశము కేవలము పరిశ్రమలపై ఆధారపడినది. అందుచే తన సరుకులమ్ముటకై పెద్ద సామ్రాజ్యమును సంపాదించినది. ఆ సామ్రాజ్యముపై తన పరిశ్రమలను మోపి అక్కడి నుండి తినుబండారములను సంపదను తీసుకొని పోవును. ముఖ్య పట్టణము లండన్. అందు జనసంఖ్య డెబ్బది లక్షల కన్న మించి కలదు. ప్రపంచములో నెల్ల పెద్ద నగర మీ లండనే. యింగ్లండులో నూటికి ౧౧ మందియే వ్యవసాయముపై ఆధారపడినారు. ఇంగ్లండు నుండి విశేషముగా

బట్టలు, యినుప సామానులు, మిషనులు, ఉన్నిబట్టలు, మోటార్లు, సైకిళ్ళు ఎగుమతి యగుచుండును. ఇంగ్లండు రాజు శాసనబద్ధుడగు రాజు. పార్లమెంటు అధికారమునకు బద్ధుడైన నామకార్థపు రాజు. ఇంగ్లండు, స్కాట్లండుతో పాటు వాటి ప్రక్కన ఉన్న ఐర్ అను ద్వీపము చేరియుండెను. కాని ఆ ద్వీపము బహుకాలము ఇంగ్లండుతో పోరాడి 30 ఏండ్ల క్రిందట స్వతంత్ర దేశమయ్యెను.

జర్మనీ:- వైశాల్యము ౧,౩౮,౦౦౦ చదరపు మైళ్ళు. జన సంఖ్య ౭ కోట్లు. దానికి ౧౯౧౮ వరకు కైజర్ రాజు లుండిరి. కాని ఆనాటి నుండి అది నానా విధాలుగా మారుచు హిట్లరుకు లోబడి ౧౯౪౫ లో ఓడిపోయి పరాధీన దేశమయ్యెను. జర్మనీ ముఖ్యపట్టణము బర్లిన్. జర్మనీ పరిశ్రమలకు జగద్విఖ్యాతము. జర్మనులు మందులు, మిషనులు, ఏ వస్తువులు సిద్ధము చేసినను అవి మంచివి, ఉత్తమమైనవి, సరసమైనవి అని ప్రసిద్ధిగాంచినవి. ఇప్పుడది రెండు చీలికలైనది.

ఆస్ట్రియా:- ౩౪,౦౦౦ చదరపు మైళ్ళు. జనసంఖ్య ౧౭ లక్షలు. అచ్చట కాగితాలు, పెనిసిళ్ళు, బొమ్మలు ముఖ్య పరిశ్రమలు. ముఖ్యపట్టణము వియన్నా. అది ప్రజారాజ్యమే.

జెకోస్లావియా :- వైశాల్యము ౪౯,౩౬౮ చదరపు మైళ్ళు. జనసంఖ్య ౧౪౬ లక్షలు. అచ్చట అగ్గిపెట్టెలు, కాగితాలు, బొమ్మలు, ముఖ్య పరిశ్రమలు. ప్రేగు ముఖ్య పట్టణము. ఇది రిపబ్లిక్.

రుమేనియా :- వైశాల్యము ౯౫౦౦౦ చదరపుమైళ్ళు జనసంఖ్య ౧౬౬ లక్షలు. ఇది ప్రధానముగా వ్యావసాయక

దేశము. నూటికి ౧౦ మందియే పరిశ్రమలపై జీవింతురు. గోధుమలు ముఖ్యమగు పంట. బుఖారెస్టు దాని ముఖ్యపట్టణము. ౧౯౪౭ వరకు రాజుండెను. ఇప్పుడు ప్రజారాజ్యము.

ఫ్రాన్సు:- ఇంగ్లండు తర్వాత గొప్ప సామ్రాజ్యముకల దేశమిదియే. అచ్చట యినుము ప్రధానమగు పరిశ్రమ. అచ్చట పట్టు పరిశ్రమకూడ చాలప్రఖ్యాతి కన్నట్టిది. మంచి సారాయి సిద్ధము చేయుటలో ఫ్రాన్సుదే పెట్టినపేరు. ప్యారిస్ నగరము దాని ముఖ్యపట్టణము. ౨ లక్షల ౧౩ వేల చదరపు మైళ్లు వైశాల్యము. జనసంఖ్య ౪౨౫ లక్షలు. సిరియా, ఇండోచీనా, కాంబోడియా, కొచిన్ చీనా, ఆఫ్రికాలోని కొన్ని భాగాలు దీని అధీనములో కలవు. ఆఫ్రికాతప్ప తక్కిన భాగా లన్నియు స్వతంత్రమయి పోవుచున్నవి. ఫ్రాన్సులో రిపబ్లికు (ప్రజారాజ్య) పద్ధతి కలదు.

ఇటలీ:- వైశాల్యము ౧౯౩౦౦౦ చదరపుమైళ్లు. జనసంఖ్య ౪ కోట్ల ౫౭ లక్షలు. ముఖ్యపట్టణము రోము. ౧౮౦౦ ఏండ్లక్రిందట రోము సామ్రాజ్యము జగద్విఖ్యాతి పొందెను. ఈ దేశములో ద్రాక్షపండ్లు, వాటిపరిశ్రమ ఎక్కువ. రాజుకలడు.

పోలెండు:- ప్రధానముగా వ్యవసాయదేశము. వార్సా దాని ముఖ్యపట్టణము. వైశాల్యము ౧౫౦ వేల చదరపు మైళ్లు. జనసంఖ్య రెండున్నరకోటి. రిపబ్లికు పరిపాలనకలది.

బాల్టిక్ రాజ్యాలు:- రష్యాకు పశ్చిమోత్తరముగా ఎస్టోనియా, లాట్వియా, లితుయోనియా, ఫిన్‌లెండు, డెన్మార్కు దేశాలు కలవు. ఇవి ముఖ్యమయినవికావు.

~~*~~

# ౪. ఉత్తర అమెరికా ఖండము

ఈ ఖండములో ౧. కనడా, ౨ సంయుక్త అమెరికా 3. అలాస్కా, ౪. మెక్సికో, ౫. మధ్యఅమెరికా, ౬. పశ్చిమ ఇండియాదీవులు అనుభాగాలు కలవు.

కనడా:- ఇది ఇంగ్లీషువారి వలస రాజ్యము. వైశాల్యము 3౯ లక్షల చదరపుమైళ్ళు. జనసంఖ్య ౧ కోటి 3౨ లక్షలు. కనడాలో నానాజాతులుకలవు. ఫ్రెంచివారు, ఇంగ్లీషు వారు యెక్కువగా ఉన్నారు. చేపలుపట్టుట అచ్చట చాలా గొప్ప పరిశ్రమ. వ్యవసాయము జనుల ప్రధానవృత్తి. గోధుమలు ముఖ్యమగుపంట. అచ్చట గొప్పబంగారుగనులుకలవు. కనడాలోని నికెల్ గనులలో, ప్రపంచములోని నికెల్ లోహము లలో నూటికి ౯౦ పాళ్ళు దొరుకును. అస్బెస్టాస్ అను పదార్థము ప్రపంచములోని అస్బెస్టాస్‌లో నూటికి ౯౫ పాళ్ళు అందేదొరకును. ప్రపంచములోని టింబరులో(కట్టెలో)కనడా దే అగ్రస్థానము. ఒట్టావా అనునగరము కనడాముఖ్యపట్టణము. ఈ దేశము బ్రిటిషువారి వలసరాజ్యము (కాలనీ)గానున్నది.

సంయుక్త అమెరికా రాష్ట్రము:- దీనిని ఇంగ్లీషులో యు. ఎస్. ఏ. (యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా) అందురు. ప్రపంచములో నెల్ల అత్యంత భాగ్యవంతమగు దేశమిదియే.

దీని వైశాల్యము 3౦,౨౨,3౮౭ చదరపు మైళ్లు. జనసంఖ్య ౧౬ కోట్లు. ౨౦౦ ఏండ్లకిృందట ఆదేశము ఇంగ్లీషు వారికి లోబడియుండెను. కాని తర్వాత తిరుగబడి స్వతంత్ర దేశమయ్యెను. ఆదేశములో ౪౯ రాష్ట్రాలున్నవి. అన్నియు కలిసి ౪ ఏండ్లకొకమారొక అధ్యక్షుని యెన్నుకొని సెనేటు

అను సభద్వారా రాజ్యము సాగించును. ఆ దేశములో వ్యవసాయముపై నూటికి ౩౦ మంది ఆధారపడినారు. తక్కిన వారందరును పరిశ్రములచే జీవింతురు. గోధుములు ముఖ్యమగు పంట. ప్రపంచములోని ప్రతి పంటలో నూటికి ౬౦ పాళ్లు ఈ దేశములో పండును. ప్రధాన పరిశ్రములు ఇనుము, ఉక్కు పనులు. సంయుక్త అమెరికాలో పెట్రోలు చాలా దొరుకును. ప్రపంచపు పెట్రోలులో నూటికి ౭౦ పాళ్ళచ్చట దొరుకును. అచ్చట పెట్రోలుగనులయొద్ద గ్యాలనుపెట్రోలు ధర ౪ అణాలకన్న తక్కువే. అచ్చట ౨౬౦౦౦మైళ్ళ రైలు దారి కలదు. అనగా ప్రపంచపు రైలుదారిలో నూటికి ౪౫ పాళ్ళ రైలుదారి అందుకలదు.

వాషింగ్టన్ దాని ముఖ్యపట్టణము. న్యూయార్కు పట్టణము అమెరికాలోనిదే. అది లండన్ తర్వాత ప్రపంచములోనెల్ల గొప్పనగరము.

మెక్సికో:- ఇది ప్రాచీన కాలమందు మిగులనాగరికత పొందినట్టిది. మధ్యకాలములో స్పెయిన్ వారు గెలిచి చాల ఘోరములు చేసిరి. ఆ దేశములో మొక్కజొన్నలు, కాఫీ గింజలు ముఖ్యమగు పంటలు. అక్కడ పెట్రోలియం, వెండి, సీసము, తుత్తినాగము, బంగారు విశేషముగా లభించును. ప్రపంచములోకెల్ల అచ్చటి గనులలో యెక్కువ వెండి దొరుకును. దాని ముఖ్యపట్టణము పేరు మెక్సికో యనియే యందురు. దాని వైశాల్యము ౭౬౭౦౦౦ చదరపు మైళ్ళు. జనసంఖ్య ౧ కోట్ల ౯౬ లక్షలు. ఇందు రిపబ్లికు ప్రభుత్వము అధ్యక్షుని యెన్నిక ద్వారా జరుగును.

# ౫. దక్షిణ అమెరికా ఖండము

ఆ ఖండములో అమెజాన్, ఓరినోకో, కొలోరాడో అనునవి గొప్పనదులు. ఆ ఖండములోని ఆదిమ నివాసులను అణగద్రొక్కి యూరోపు తెల్ల జాతులవారు చాలభాగము లాక్రమించుకొన్నారు. ఆ ఖండములో ౧౨ భాగాలున్నవి.

| | | |
|---|---|---|
| ౧. పనామా | ౫. గయానా | ౯. ఛిలీ |
| ౨. కొలంబియా | ౬. బ్రెజిల్ | ౧౦. ఆర్జెంటైనా |
| 3. ఈక్వెడార్ | ౭. పెరూ | ౧౧. పరుగ్వే |
| ౪. వెనుజులా | ౮. బొలీవియా | ౧౨. ఉరుగ్వే |

౧. పనామా:- ఆ భాగము ఆదినుండి ఉత్తర అమెరికాతో కలిసియుండెను. కొన్ని యేండ్ల క్రిందట అచ్చట కాలువ తీసి శాంతిమహాసాగరమును అతలాంతికసముద్రమును కలిపిరి.

౨. కొలంబియా:- అక్కడ చెరుకు, కోకో, కాఫీ వంటివి బాగుగపండును. గనులలో సమృద్ధిగా వెండి, బంగారు దొరుకుచున్నవి.

3. వెనుజులా:-అది వైరాజ్యము (ప్రజారాజ్యము). కోకో, కాఫీ, చెరుకు, పొగాకు, ప్రత్తి, మక్కలు, నీలి, వరి సమృద్ధిగా పండును. గొప్పనూనెగనులు కలవు. ఆ దేశములో రిపబ్లిక్ ప్రభుత్వము కలదు.

౪. ఈక్వెడార్:- చాలాబీద దేశము. కోకోమాత్రమే బాగా పండును. ఆ దేశములో రిపబ్లిక్ ప్రభుత్వము కలదు.

౫. బొలీవియా:- వ్యవసాయ ప్రధాన దేశము. టిన్, రాగి, వెండి, బంగారు గనులు కలవు. ఎఱ్ఱ యిండియనులే అక్కడ వున్నారు. అందు రిపబ్లిక్ ప్రభుత్వము కలదు.

౬. ఛిలీ:—అది దక్షిణ అమెరికా ఖండములో సగము వరకున్న దేశము, వ్యవసాయ ప్రధాన దేశము. ప్రపంచము లోని కాఫీగింజలలో నూటికి ౮౦ పాళ్లు అచ్చట పండును. ఆ దేశములో విపరీతముగా పందులను పెంచుదురు. లోహ ములు, వజ్రాలుకల గనులు చాలాగలవు. మాంగనీసు అను నది చాలా యెక్కువగా అందు దొరకును. ఆ దేశములో కూడా రిపబ్లిక్ ప్రభుత్వము కలదు. అన్నియు సులక్షణములే కాని దేశసంపదను సరిగా వృద్ధిచేయలేదు.

౭. ఆర్జంటైనా:—వ్యవసాయ ప్రధాన దేశము. గోధుమలు చాలా పండును. అది వైరాజ్యము (రిపబ్లిక్).

౮. ఉరుగ్వే:—చాలా వృద్ధిపొందిన దేశము. అందరును తెల్లవారే.

౯. పెరూ:—ప్రాచీనములో చాలా నాగరికత పొందిన దేశము. 300 ఏండ్లక్రిందట మెక్సికోను గెలుచుకొన్నట్లుగా దానినికూడా స్పెయిన్ వారు గెలిచిరి. అప్పుడు ఆ దేశసంప దను తెల్లవారందరు పంచుకొన్నారు. దాని నూనె గనులను సంయుక్త అమెరికా వారు, ప్రత్తిభూములను జపానువారు, జర్మనీవారు రైల్వేలను, ఇంగ్లీషువారు బ్యాంకులను, ఇటలీ వారు చక్కెర పరిశ్రమలను పంచుకొన్నారు.

౧౦. గినీ:—ఈ మండలమును ఫ్రెంచి, ఇంగ్లీషు, డచ్చి (హాలెండు) వారు పంచుకొన్నారు.

# ౬. ఆఫ్రికా ఖండము

అనేక విచిత్రఖండము. అత్యుష్ణ దేశ మగుటచేత అందలి జనులు కారునల్లగా ఉందురు. వారిని నీగ్రోలని అందురు. వారు దిగంబరులుగాను లేక గోచీలతోను తిరుగుదురు. వారికి అవసరాలు చాలా తక్కువ. వారు సోమరులు, పిరికివారు, నాగరికత ఎరుగరు.

ఆఫ్రికా ఖండమును యూరోపువాసులందరు ఎవరికబ్బిన భాగమును వారాక్రమించి సరిహద్దు లేర్పాటుచేసుకొని ఠికానా వేసినారు. ఇంగ్లీషు, ఫ్రెంచి, బెల్జియం, పోర్చుగీస్, ఇటలీ, స్పెయిన్ వారు ఆ ఖండమును పంచుకొన్నారు. అత్యుష్ణముగా ఉండి తెల్లవారికి నిలుచుటకు వీలులేనిఎడారులను, ఎడారివంటి దరిద్రభూములను తెల్లవారు వదలి వేసినారు.

బ్రిటిషువారి భాగాలు:— పశ్చిమాఫ్రికా భాగములోని గాంబియా, గోల్డుకోస్టు, లియోన్ మండలాలు, తూర్పున సూడాన్, ఉగాండా, టాంగనికా, కెన్యా, న్యాసాలెండు, రోడీషియా, సోమాలీ దేశము. ఉత్తరమున ఈజిప్టు, దక్షిణమున దక్షిణాఫ్రికా, నేటాల్, ట్రాన్స్వాల్, ఆరెంజ్ మున్నగునవి.

ఈజిప్టు:— పై దేశములో ఈజిప్టు చాలాముఖ్యమైనది. సుమారు ౬౦౦౦ ఏండ్లకిందట కూడా అదిచాలా గొప్పనాగరికత పొందిన దేశము. అచ్చటి నీలునదియే దానికి ముఖ్యాధారము. దాని మూలమున ౧౨౦౦౦ చదరపుమైళ్లు భూమి

శిస్తు అగును. ముఖ్యపట్టణము ఖాయిరా (కైరో). ఈ దేశము ఇంగ్లీషువారికి లోబడిన దేశము. ఇప్పుడు స్వతంత్రత పొందినది.

అబిసీనియా:— ఇది ఈజిప్టుకు తూర్పుననున్నది. పేరుకు స్వతంత్రదేశము. కాని అది బ్రిటిషువారి కనుసన్నలో వున్నది. అచ్చటి హబ్షీలు దక్షిణహిందూస్థాన సుల్తానుల యొద్ద సిపాయీలుగా పనిచేసినట్టివారు.

ఆఫ్రికా ఖండము జనసంఖ్య ఇంచుమించు ౨౨కోట్లు. అందు సగము మంది ముసల్మానులు. ఆఫ్రికాలోని దక్షిణ భాగములో వజ్రాల గనులున్నవి. ఆఫ్రికా వైశాల్యము ౧౧౨౬౮౭౭౨ చదరపుమైళ్లు.



# ౭. ఆస్ట్రేలియా ఖండము

ఆఫ్రికాకంటె అధ్వాన్నముగా అష్టదరిద్రముగాఏర్పడి నది ఈ ఆస్ట్రేలియాఖండము. ఇంగ్లీషువారు దానిని తుపాకులు చూపి ఆక్రమించుకొనిరి. ఆదిమ నివాసులను ఆటవికులను క్రమక్రమముగా మాయమగునట్లు చేసిరి. దాని వైశాల్యము ౩౦ లక్షల చదరపుమైళ్లు. అనగా యించుమించు మన హిందూస్థానమునకు రెండంతల దేశము. కాని మన దేశములో ౪౦ కోట్లమందివుంటె మన దేశమునకు రెండంతల దేశమగు ఆస్ట్రేలియాలో ౮౦ లక్షలమంది మాత్రమే వున్నారు. అనగా మైలుకు ముగ్గురుకూడా లేరన్నమాట. వారందరు తెల్లవారే. ఆ ఖండము చాలా ఉష్ణప్రదేశము. తెల్లవారికి పనికివచ్చునట్లు దేవుడు దానిని సృష్టింపలేదు. కాని ఆ దేశమును ఆక్రమించుకొన్న తెల్లవారు దానిని వదలరు. ఇతర రంగుజాతుల వారిని దానిలోనికి రానియ్యరు. ఆ ఖండములో బంగారు విశేషముగా లభించుచున్నది. అందుచేత అది తెల్లవారికి శాశ్వతపట్టాగా ఉండిపోయినది. ఆస్ట్రేలియా ఒక పెద్దద్వీపము. చుట్టు సముద్రతీరమును ఆశ్రయించుకొని తెల్లవారు నివసించుచున్నారు. అక్కడనే వారు వ్యవసాయము బాగా సాగించుచున్నారు. గోధుమలు చాలాబాగా పండించుచున్నారు. అచ్చటి గొర్లమందలు ప్రపంచమందగ్రస్థానము వహించినవి. నేలబొగ్గు, వెండి, యినుము, సీసము గనులు కూడా అందుచాలాకలవు. ఆస్ట్రేలియా మొదట ఇంగ్లీషువారి అధీనదేశము. కాని తర్వాత అది తమజాతి

వారిదే కాన దానిని వలసరాజ్యముగాచేసి తమ అధీన స్వాతంత్ర్య దేశముగా చేసివేసిరి.

న్యూజీలెండు:- ఆస్ట్రేలియాకు సమీపమందే న్యూజీలెండు అను దీవులున్నవి. అవికూడా యింగ్లీషువారి వలస దీవులు. ఇంగ్లీషువారాదీవులను ఆక్రమించుకొనుటకు ముందు ఆ దీవులలో మోరీ అను ఆదిమవాసులుండిరి. ఆ దీవులు తమ యింగ్లండువలెనే చల్లని దీవులగుటచేత ఆదిమ నివాసులను క్షీణించునట్లుచేసి తామే నిండిపోయిరి. ఇప్పుడు ఆదిమ నివాసులందు నూటికి యిద్దరు మాత్రమే వున్నారు. ఆ యిద్దరు కూడా ఏనాడు ఊడిపోదురో యేమో!

ఆ దీవులలో ప్రపంచములో ఎక్కడకూడ లేనన్ని గొఱ్ఱెలున్నవి. పాలు, వెన్న పరిశ్రమ అందు చాలావృద్ధియైనది. వెల్లింగ్టన్ అను పట్టణము ఆ దీవులకు ముఖ్యపట్టణము. ఆ దేశ వైశాల్యము ౧౦౩,౪౧౬ చదరపుమైళ్ళు, జనసంఖ్య ౨౦ లక్షలు. అనగా మైలుకొక మనిషికూడా లేడు. అది యింగ్లీషువారి వలసరాజ్యము. దానిని రెండవ యింగ్లండు అని అందురు. అందుచేత రంగుజాతులను అందుండనీయరు.



# ౮. ఆసియా ఖండము

ఆసియా ఖండమును ఏషియా అని కూడా అందురు. ఈ ఖండములోని ముఖ్య దేశము లేవనగా:-

౧. ఇండోచీనా
౨. చీనా
౩. జపాను
౪. మంచుకో
౫. ఫిలిప్పైన్ దీవులు
౬. కొరియా
౭. తూర్పు ఇండియా దీవులు (ఇండోనీషియా)
౮. థాయిలెండు (సయాం)
౯. సిరియా
౧౦. పాలస్తీన్
౧౧. ఈరాకు
౧౨. ఆసియాలోని రష్యా
౧౩. ఆఫ్గనిస్తాన్
౧౪. ఈరాన్ (పర్షియా)
౧౫. అరేబియా
౧౬. హిందూస్థానము
౧౭. సింహళము
౧౮. పాకిస్తాన్
౧౯. మలయా
౨౦ బర్మా
౨౧. టిబ్బెట్
౨౨. నేపాళము

---

ఆసియాఖండ వైశాల్యము ౧౭౦,౪౩,౮౭౨ చదరపు మైళ్లు, జనసంఖ్య ౧౩౫ కోట్లు.

ఈ దేశాలను తెలిసికొనుటకు పూర్వము 3000 ఏండ్లకు ముందు గొప్ప నాగరికత పొంది సామ్రాజ్యాలను స్థాపించి తర్వాత పేరు గుర్తుకూడా లేకుండ మాయమై పోయిన నాలుగు దేశాలనుగూర్చి కొంత తెలిసికొనవలెను.

ఇప్పటి ఈరాకు ప్రాంతములో అసీరియా, బాబిలోనియా, ఖాల్డియా అను మూడు గొప్ప నాగరిక దేశాలు

మూడు నాలుగు వేల యేండ్ల క్రిందట వెలసెను. ఇప్పటి పాలస్తీన్ ప్రాంతములో పినికియా అను దేశముండెను. అదియు 3000 ఏండ్ల క్రిందటి గొప్ప నాగరిక రాజ్యము.

ఇప్పటి ఈరాన్ దేశమున కుత్తరముగా మీడియా అను దేశముకూడా అట్టిదే. ఈ నాల్గింటిని గూర్చి వేరు చరిత్రలు కలవు. అభిలాషులు వాటిని చదువుకొన వచ్చును.

( చూడుడు విస్మృత సామ్రాజ్యములు – హైదరాబాదు )

ఇక ఆసియా ఖండములోని వివిధభాగాలను గూర్చి సంగ్రహముగా తెలిసికొందము.

జపాను:–ఆసియాలో దౌర్జన్యజాతిఅనియు, సామ్రాజ్యవాది అనియు పేరొందిన ౧౯౪౫లో మంటగలసినది జపాను దేశము. జపాను క్రింద తూర్పు దీవులు కొన్ని, కొరియా, మంచూకో అను దేశాలుండెను. ౧౯౪౫ యుద్ధముతో తన స్వాతంత్ర్యమే కోలుపోయినందున దాని సామ్రాజ్యము మంటకలిసెను. జపానులో చిన్నవి పెద్దవి ద్వీపాలు కలవు. అవన్నియు కలసికూడా హిందూస్థానములో ౧౨వ భాగమగును. జనసంఖ్య ౮ కోట్లు. జపాను దీవులలో ఎల్లప్పుడు భూకంపాలు కలుగుచుండును. కాని ప్రమాదకరమగు భూకంపాలు ఏడెనిమిదేండ్ల కొకమారు వచ్చును. జపానులో చాలా దీవులుండుటచేత జపానీలు సముద్ర వ్యాపారులైరి. పైగా వారిలో సగముమంది, చేపల తిండిచేత, చేపలవ్యాపారముచేత జీవింతురు. జపానులో అడవులు చాలాకలవు. అందు బొంగులు, లక్క చెట్లు, కర్పూరపుచెట్లు పట్టుపురుగులకు కావలసిన మల్బరీ (మహాతూత్) చెట్లు చాలా కలవు.

జపాను అధీనములోని ఫార్మోసాదీవిలో చాలా కర్పూరపు చెట్లు కలవు. మరియు దాని దక్షిణ దీవియగు క్యూష్యూలో కూడ అవికలవు. ఆ రెండు దీవులనుండియే మన దేవతలకు కర్పూరము లభించుచున్నది. జపానులో నేలబొగ్గు సమృద్ధిగా దొరుకుచున్నది. జపాను పర్వతాలు కొన్ని అగ్నిపర్వతాలై యున్నవి. వాటినుండి గంధకము సమృద్ధిగా దొరుకుచున్నది. జపానువారు విద్యుత్తును (ఎలెక్ట్రిసిటీ) బాగా వృద్ధిచేసి పల్లెలకు కూడా అందించుచున్నారు. జపానులో పట్టుపరిశ్రమ, రంగురంగుల టస్సర్ బట్టలు, బొమ్మలు, రబ్బరుసామానులు, చాలా వృద్ధిపొందినవి. వారి అగ్గిపెట్టెలు, ఛత్రములు, కాగితాలు కూడా १९३९-४९ యుద్ధమునకు పూర్వము మన దేశమునిండ నిండుకొని పోయియుండెను. జపాను ముఖ్యపట్టణము టోకియో. అది ప్రపంచములో మూడవ నగరము.

కొరియా:— అది యుద్ధమునకు పూర్వము జపాను క్రింద నలిగి యిప్పుడు అమెరికా, రష్యావారి చేతులలో పడినది. ఎక్కువగా వృద్ధికాని దేశము.

చీనా దేశము:— ఇది చాలా ప్రాచీన నాగరికతగల దేశము. హిందూస్థానముకన్న గొప్ప వైశాల్యము కలది. జనసంఖ్యకూడా ४९ కోట్లకు మించినది. చీనాక్రిందనే టిబెటు దేశమున్నది. కాని అది నామకార్థపు పరాధీనతయే.

కొన్ని యేండ్లనుండి చీనాదేశము ప్రజారాజ్యమై యున్నది. దానిలో మంగోలియా, మంచూరియా దేశాలు చేరియుండెను. కాని అవి యిప్పుడు వేరై పోయినవి. చీనానుండియే ఫ్రెంచివారు ఇండోచీనాను లాగుకొనిరి. ఇంగ్లీషు

వారు మలయాను లాగుకొనిరి. చీనా తూర్పుతీరపు రేవుల నన్నిటిని తెల్లజాతులవారు పంచుకొనిరి. చీనా వ్యవసాయ ప్రధాన దేశము. వరి ప్రధానమగు పంట. సగటున ఎకరానికి ౯౦౦ సేర్ల వడ్లు పండును. పొగాకు, తేయాకు, సమృద్ధిగా పండును. సోయాగింజలకు చీనాయే ప్రధానదేశము. పట్టు బట్టల పరిశ్రమ ఆ దేశములో విశేషముగా కలదు. ఇనుము, వెండి, నేలబొగ్గుగనులు చాలాకలవు. ఇతర లోహాలుకూడా కొద్దిగా కలవు. చీనా ముఖ్యపట్టణాలు పలుమార్లు మారుచూ వచ్చెను. యుద్ధమునకుపూర్వము నాంకింగ్ ఉండెను. ఇప్పుడు పెకింగ్. చీనా చక్రవర్తిని ౧౯౧౧ యేండ్లనాడే తొలగించి ప్రజా రాజ్య మేర్పాటుచేసిరి. ఇప్పుడు కమ్యూనిస్టులు దానిని జయించి ఆక్రమించుకొన్నారు. చీనా నేడు బలమైనరాజ్యము లలో నొకటిగ వున్నది.

మంచూకో:- పూర్వము దానిని మంచూరియా అనిరి. వైశాల్యము ౪౬౦,౦౦౦ చదరపుమైళ్ళు. ముఖ్యమగు పంటలు, సోయాగింజలు, జొన్నలు, గోధుమలు. ప్రపంచము లోని సోయాగింజల పంటలో సగముపంట యిచ్చటనే పండును. దానిని జనులు తిందురు. పైగా దాని నూనెతో గోడుగు బట్టలకు రంగువేసిన నీరింకదు. అదే నూనెను రంగు లలో కలుపుదురు. దానితో సిరాను, సబ్బులను చేయుదురు.

ఇండోచీనా :- ఇది ఫ్రెంచివారి అధీనదేశము. వైశా ల్యము ౨౮౧,౦౦౦ చదరపుమైళ్లు. అందు గొప్ప అడవులు కలవు. దానిలోనే ప్రత్తికి ప్రసిద్ధికాంచిన కాంబోడియా మండలమున్నది.

సయాము :- సయామును ఇప్పుడు తాయిలెండు అని అనుచున్నారు. పేరునకు స్వతంత్రదేశము. ౧౯౩౯-౪౫ యుద్ధమునకు పూర్వమది ఫ్రెంచివారి కనుసన్నలలో మెలి గెను. ఇప్పుడు ఇంగ్లీషువారి కనుసన్నలలో నున్నది. వైశా ల్యము ౧౯౮,౦౦౦ చదరపుమైళ్లు. వరి ముఖ్యమగు పంట. ముఖ్యపట్టణము బాంకాక్. అది సుందరనగరమని ప్రతీతి. ఈ దేశమునకు రాజున్నాడు. ఇప్పుడు, ఇంగ్లాండు అమెరికాల క్రింద నలిగిపోవుచున్నది.

మలయా :- ఇది ఇంగ్లీషువారి అధీనదేశము. అందు రబ్బరు విపరీతముగా కలదు ప్రపంచపు రబ్బరు ఉత్పత్తిలో మూడవభాగ మిందే ఉత్పత్తి అగును. అదే విధముగా మూడవవంతు టిన్ యిక్కడనే లభించును. ౧౯౪౫ యుద్ధ కాలములో అక్కడి టిన్ మనకు రానందున టిన్ డబ్బాలకు చాలా ధర పెరిగిపోయెను. టెంకాయచెట్లు అత్యధికముగా ఉండుటవల్ల మలయా కొబ్బెర అమెరికాకు, ఇంగ్లండునకుకూడా యెగుమతి అగును.

తూర్పు ఇండియాదీవులు :- వీటిలో సుమత్రా, జావా, సెలిబెస్, బలి, బోర్నియో ద్వీపాలు చేరినవి. వీటినిప్పుడు ఇండోనీషియా అందురు. ఈ ద్వీపాలలో పూర్వము హిందు వులు తమ వలసలను స్థాపించి అచ్చటి ప్రజలకు వైదికమతము తర్వాత బౌద్ధమతమును ఇచ్చిరి. తరువాత తురకలు తమ ఇస్లామును వ్యాపింపజేసిరి. ఇప్పటికినీ ఈ దీవులలో కొందరు హిందువులున్నారు. బోర్నియోలో సగము ఇంగ్లీషువారిది. తక్కినవన్నియు హాలెండు (డచ్చి) వారికి బానిసదేశాలై

పోయినవి. ఆ దీవులు చాలా సారవంతమైనవి. ఉండలి లవంగాలు, ఏలకులు, జాపత్రి, వక్కలు మున్నగు సుగంధద్రవ్యాలు ప్రపంచమంతట వ్యాపారమగుచున్నవి. అచ్చట సింకోనా చెట్లు విశేషముగా కలవు. వాటినుండి క్వినైన్ (క్వైనా)ను సిద్ధము చేసి చలిజ్వరాలకిత్తురు. చెరకు చాలా ఎక్కువగా పండుట చేత ఆ ద్వీపాల చక్కెర మన దేశములో, మన చక్కెరకంటే అగ్గువగా అమ్ముచున్నది. అచ్చట రబ్బరు, కొబ్బెర, కాఫీ, తేయాకు, పొగాకు సమృద్ధిగా లభించును. ఇంకొక విశేషమేమన ఆ దీవులలో పెట్రోలు గనులు చాలాకలవు. టిన్ కూడా చాలాకలదు. ఇండోనీషియా డచ్చివారి అధీనము నుండి ౧౯౪౯ లో బయటపడి స్వతంత్ర ప్రజారాజ్యమైనది. జోగ్జాకార్తా నేడు ముఖ్యపట్టణముగ నున్నది.

ఫిలిప్పైన్ దీవులు :- ఇవి చీనాకు తూర్పున కలవు. చిన్నవి పెద్దవి కలిసి ౭౦౦౦ దీవులున్నవి. ఇవి పూర్వము స్పెయిన్ వారివి. తర్వాత అమెరికావారు వాటిని గెలుచుకొనిరి. ఇప్పుడు అమెరికావారి అధీనములో స్వాతంత్ర్యము పొందినవి. మనిలా అను నగరము ఈ దీవుల ముఖ్యపట్టణము.

సిరియా :- ౫౫,౦౦౦ చదరపుమైళ్ళు. ౨౦ లక్షల జనసంఖ్య. ఫ్రాన్సుకు లోబడినది. వ్యవసాయ ప్రధానదేశము.

ఈరాన్ :- దీనిని పారిస్, పర్షియా అనియు అందురు. ౬ లక్షల చదరపుమైళ్ళ వైశాల్యము. జనసంఖ్య ౧ కోటి ౫౦ లక్షలు. వ్యవసాయ ప్రధానదేశము. నూనెగనులకుప్రసిద్ధి. అందుచేత ఇంగ్లీషు, రష్యాదేశాలు దానిని సాగదీయుచున్నవి. టెహరాన్ ముఖ్యపట్టణము. ౨౩౦౦ ఏండ్లకు పూర్వము

ఈరాక్ చాలా గొప్ప సామ్రాజ్యమైయుండెను. ఈరానీలు హిందువులకు ప్రాచీనమందు దగ్గరివారు. ఆర్యశబ్దమే ఈరాక్ అయినది. ఈరాక్‌లోని ఒక మండలము పేరు ఆర్యాణమని యుండెను. ఆజర్ బైజాక్ అనే నగరమును ప్రాచీనమందు ఆర్యబీజము అని పిలిచిరి. దారా (Darius) చక్రవర్తి క్రీ. పూ. ౫౦౦ ప్రాంతములో తాను ఆర్యపుత్రుడనని శాసనము వ్రాయించుకొనెను. ౧౨౦౦ ఏండ్ల క్రిందటి అరబ్బులలో ఇస్లాము ఉత్పత్తియై విజృంభించెను. వారు ఈరానును గెలిచి అందలి జరథుస్త్రి మతమును తుడిచివేసి దేశమును ఇస్లాములో కలిపిరి.

పాలస్తీన్:- బ్రిటిషువారి అధీనదేశమై యుండెను. ౯000 చదరపుమైళ్ళ వైశాల్యము కలది. జనసంఖ్య ౨౦ లక్షలు. ఇప్పుడు స్వతంత్ర దేశమైనది. అచ్చట యహూదీలు, అరబ్బులు కలరు.

ఈరాఖ్:- ఇంగ్లీషువారి అధీనదేశము. ౧,౪౫,000 చదరపుమైళ్ళ వైశాల్యము కలది.

ఆఫ్గనిస్థానము:- హిందూస్థానమునకు పశ్చిమోత్తరమున వున్నది. అంతయు పర్వతమయము. అది వ్యవసాయ ప్రధాన దేశము. స్వతంత్ర దేశము. అందరును ముస్లిములే. ఈ దేశమును అమీర్ అనుప్రభువు పరిపాలించును.

అరేబియా:- ౧౨ లక్షల చదరపుమైళ్ళ దేశము. ఇంచుమించు హిందూస్థానమంతటిది. కాని ముప్పాతిక భూమి ఎడారియైనది. జనసంఖ్య ౬౦ లక్షలు మాత్రనే. అరేబియాలోని యమన్ అనుమండలములోనే మోచాకాఫీ అనే పేరు

గల కాఫీగింజలు సమృద్ధిగా పండును. అక్కడి కాఫీయే మన దేశములో, మొదట మైసూరులో ప్రారంభమై యిప్పుడు ఇతర ప్రాంతాలలో వ్యాపించినది. ఖర్జూరపండ్లకు అరేబియా దేశము ప్రసిద్ధి. అరేబియా ప్రపంచ ముస్లిముల కందరికిని పవిత్ర క్షేత్రమైనది. అందలి మక్కా, మదీనా పట్టణాలకు మన దేశపు ముస్లిములు చేతనైన వారందరును తీర్థయాత్ర చేసి వత్తురు. ఆ దేశమునకు ఒక ప్రభువు కలడు. అతడు నిరంకుశుడు.

బర్మా:- పూర్వమిది హిందూస్థానములో చేరియుండెను. ౧౯3౯లో దానిని ఇంగ్లీషు ప్రభుత్వము వేరుచేసెను. అందు విశేషముగా వరిపండును. వరి అక్కడినుండి మన దేశమునకు దిగుమతి అగును. రంగూన్ ముఖ్య పట్టణము. బర్మాలో గొప్పలాభాలు కలుగునని ఉత్తర సర్కారుల తెనుగువారు అక్కడికి చాల పోవుచుందురు. ఈ దేశమిప్పుడు స్వతంత్ర దేశమైనది.

సింహళము - హిందూస్థానమునకు దక్షిణమున వున్న ద్వీపము. ఇంగ్లీషువారి యధీనమందలమై యిప్పుడు స్వతంత్ర దేశమైనది. తేయాకు, కొబ్బెర అతి విస్తారముగా పండును. అది ఎక్కువగా యితర దేశాల కెగుమతి అగును.

టిబెట్:- ఇది నామకార్థముగా చీనాకు లోబడినది. దీనిని మన పూర్వులు త్రివిష్టప దేశమనిరి. దాని తద్భవమే తిబ్బట్. అది హిమాలయమున కుత్తరమున ఉన్నది. కాన చాల ఉన్నత దేశము. ప్రపంచపు మిద్దె (Roof of the World) అని దానిని అందురు. విశేషకాలము మంచు పడును. చాలా చలి యుండును. వైశాల్యము ర,౬3,౨౦౨ చదరపుమైళ్లు.

జనసంఖ్య యెవ్వరికిని తెలియదు. 30 లక్షలుండునని అంచనా. కొద్దిగా బంగారు గనులున్నవి. కొద్దిగా వ్యవసాయము, కొద్ది పాటి నేతపరిశ్రమలు కలవు. టిబెట్ పరిపాలకుని దలైలామా అందురు. టిబెటులో మన దున్నపోతులవంటి జడలుకల దున్నలుకలవు. వాటిని యాక్ అని అందురు. అవి కొండలలో కాలుజారకుండా తిరుగును. వాటిని టిబెటువారు బరువులు మోయుట కుపయోగింతురు. గొఱ్ఱెలవలె వాటి ఒంటినిండ దీర్ఘమగు వెండ్రుకలుండును.

నేపాళదేశము:- దీనిని రాజపుత్రమహారాజు పాలించు చున్నాడు. అతడు నిరంకుశ ప్రభువు. హిమాలయపర్వతము లలో 54 వేల చదరపుమైళ్ళ విశాలదేశమిది. దీనిని కూడా జయించవలెనని ఇంగ్లీషువారు రెండుమారులు ప్రయత్నము చేసిరి. కాని పర్వతాలలోని దేశము కాన నేపాలు దక్కక పోయెను. పర్వతాలలో హిందూస్థానీ సిపాయీలు ధ్వంస మైరి. అప్పటినుండి నేపాళముతో ఇంగ్లీషువారు స్నేహము చేసిరి. ఏటేట ఇంగ్లీషువారు వారికే 10 లక్షల కప్పము కట్టుతూవచ్చిరి. కట్టి నేపాలువారి గూర్ఖాసిపాయీలను తమ సైన్యములో చేర్చుకొనిరి. ప్రపంచములో నెల్లను వీరాధి వీరులగు సైనికులలో గూర్ఖాలు ప్రసిద్ధిపొందినారు. గోరక్షక అను పదమే గోర్ఖాలయ్యెను. ఖట్మండూ అనునది నేపాళరాజ ధాని. అచ్చట కొన్ని ప్రసిద్ధ శైవక్షేత్రాలు కలవు. అచ్చట నే గండకీనది కలదు. దానిలో పుట్టిన సాలగ్రామాలను హిందు వులలో చాలామంది పూజింతురు.

నేపాళరాజ్య జనసంఖ్య ౭౦ లక్షలు. ప్రభుత్వోదాయము యించుమించు ౨ కోట్లు.

హిందూస్థానము:- మనహిందూస్థానమును ఇంగ్లీషులో ఇండియా అందురు. మన ప్రాచీనులు దీనిని భారతదేశమని అన్నారు. దీని వైశాల్యము ౧౨,౨౦,౦౦౦ చదరపుమైళ్ళు. ౧౯౪౭లో మనదేశమునకు స్వాతంత్ర్యము లభించెను. మన దేశములో కొన్ని చిన్నచిన్న ప్రాంతాలను యితర తెల్ల జాతులవారు కూడా ఆక్రమించుకొని పాలించుచున్నారు. ఫ్రెంచివారి అధీనములో బెంగాలులోని చంద్రనాగోరు, మద్రాసులోని పుదుచ్చేరి (పాండిచేరి) కరకాల్, యానాం, మాహే అను స్థలములునూ కలవు. పోర్చుగీసువారి అధీనములో బొంబాయితీరములోని గోవా, దమన్, దివి అను రేవులు కలవు.

హిందూస్థానము ఉత్తరదక్షిణముగా ౨౦౦౦ మైళ్ళ పొడవున్నది. తూర్పు పడమరగా ౨౫౦౦ మైళ్ళున్నది. ఉత్తరము పొడవున హిమాలయము దేవుడు నిర్మించిన గోడగా ఉన్నది. అఫ్ఘనిస్థాన్ మూలలోనుండు హిమాలయ పర్వతములో రెండుమూడు కనుమల దారులున్నవి. బొలాన్ కనుము ఖైబర్ కనుమ అను వానినుండియే ఉత్తరమునుండి మన దేశములోనికి రావలెను. మనదేశ మధ్యభాగమందు వింధ్యపర్వతాలు కలవు. పడమటి తీరము పొడవునను సహ్యాద్రి పర్వతములు కలవు. వానినే ఇంగ్లీషులో పడమటి కనుమలు అందురు. తూర్పుతీరము పొడవున దక్షిణభాగమందు తూర్పుకనుములు కలవు. వాటినే మన పూర్వులు మలయపర్వతమని మహేంద్ర

పర్వతమని అనిరి. నల్లమల, ఎఱ్ఱమలలు మన తెలుగు దేశము లోని చిన్నపర్వతాలు. అవి తూర్పు ఘాటులలో చేరినట్టివి.

ఉత్తర హిందూస్థానములో సింధు, గంగా, బ్రహ్మపుత్ర అను గొప్పనదులు కలవు. వింధ్య భాగాలలో నర్మద, తపతి అను నదులు కలవు. దక్షిణ దేశమును దక్కన్ అందురు. దక్కనులో గోదావరి, కృష్ణ, పినాకిని, కావేరి గొప్పనదులు. తుంగభద్ర కృష్ణకు ఉపనది.

మన దేశమును యీ క్రింది విధముగా విభజించి యుండిరి. ౧. మద్రాసురాష్ట్రము ౨. బొంబాయి రాష్ట్రము 3. సింధుసూబా ౪. బెంగాల్ (వంగదేశము) ౫. ఆగ్రా, ఔధ్ అను సంయుక్త పరగణాలు ౬. పంజాబ్ ౭. బిహార్ ౮. ఒరిస్సా (ఓఢ్రము) ౯. మధ్యపరగణాలు (నాగపూర్ రాష్ట్రము) ౧౦. అస్సాం ౧౧. సరిహద్దు (పఠాన్) సూబా. ౧౨. బలూచిస్థాన్.

౧౯౪౭లో మన దేశమునకు స్వాతంత్ర్యమునిచ్చి వెళ్ళుచూ ఇంగ్లీషువారు తురకలెక్కువగా నుండుభాగమునుతురకలకు భాగించి పాకిస్థాన్ అనుపేరు పెట్టి పోయిరి. ఇప్పుడు పాకిస్థానులో చేరిన రాష్ట్రములేవనగా ౧. సరిహద్దుపశ్చిమోత్తర సూబా (N. W. F. Province) ౨. పశ్చిమ పంజాబు 3. బలూచిస్థాన్ ౪. సింధు ౫. తూర్పున బెంగాలులో తూర్పువైపు సగము భాగము.

హిందూస్థానమునకు ముఖ్యపట్టణము ఢిల్లీ (దెహ్లీ). ప్రాచీనకాలములోని పాండవుల హస్తినాపురమిదే. మొగలాయి చక్రవర్తుల రాజధాని యిదే. మన దేశములో అన్నిటి

